

శ్రీ

# రామేశ్వరీయము

అగు

# పండితబ్రువలక్షణము

సం॥

ప్రథమభాగము.



రామేశ్వరకవివిరచితము.



కే. బి. కృష్ణారావుచే
గుంటూరు వాణీ ముద్రాక్షరశాలయందు
ముద్రింపఁబడియె.

1911.

వెల 1 అణా.



శ్రీపరదేవతాపతయేనమః.

# పండితబ్రువ లక్షణము.

" నిరుపమశేముషీకలిత నిర్మలచిత్తసరోజులార! యో నరనకవీంద్రులార! బుధసత్తములార! గుణాఢ్యులార!" సత్యరతిపరీతులార! యనృతాత్యసహిష్ణుశుభాత్ములార! మీ రరయుడు నాదుపల్కులివి యన్నియు నొప్పులెయైన నర్పుడీ!

2. త్వరపడఁబోక మీ రిపుడు వాస్తవముం గ్రహియింపఁగోరు బురములయందుఁ బల్లెలఁ బ్రపూర్ణవిచారణ సేయుఁడీ! నిజం బ్రబో బెఱుగుడి! పాండితీగరిమ యొంమను లేక యఖండకీర్తిభాసురతఁ జెలంగఁగోరు పురుషుండు వికారము లెన్ని సేసినన్ ధరఁ బరిహాసపాత్రుఁడగుఁ దథ్యము సత్యము వాస్తవంబు, ముమ్మఱు బరికించి చూడ ననుమానము లేశము లెదు దీనికిన్.

3. ఖరమది సింహచర్మమును గాయము నిండను గప్పికొంచుఁ దిరిగిన నెంతదాక జగతిం భ్రమియింపఁగఁ జేయఁగల్గుఁ దొంద్రా దరగ నిజస్వభావముఁ గనంబడఁ జేయదె? సత్యసింహముల్ పొరయనిచోట్ల "నేమృగవిభుండను మీ" యనుచుం బ్రతాపముం బిరబిరఁ దీయుచుం దనసమీపముఁ జేరకయుండ నెద్దియో

వెరవుచుఁ జూపుచుం దమరు వీరలు సద్గుణశాలురంచు ను
త్తరములఁ బంపుచుం గడుహితంబుగ నెట్టులొ పుచ్చుఁగాల; మ
బ్బరమది యేమి! తన్గుఱుతుపట్టెడివారలు లేనినాడు త
త్తరపడకెట్టి వేసములఁ దాల్చినఁ బట్టెడువార లెవ్వరుం
దురు? కలకాల మొక్కగతితోఁ జనుచుండునె? యెప్పుడైన నే,
నరయఁగ నెందునేని నిజమైనమృగేంద్రము రాకయుండునే!

4. స్వరమున నైనఁ దోపదొకొ సత్యము? బింకముఁ జూపఁ, గోరి
సరసకు నీవు రాఁదగవు చాలును బొమ్మనికూయ నంతతో ["నా
నరుగునె? "తానుగాడిదె"నటంచు నెఱింగియె కూసెఁగాని యం
దఱు నటుఁ బిల్వఁ జేయవలె దానిని; గాడిదె చెంతనిల్వఁ గే
సరికదిపోలునే తగదు సత్యము సత్యము సత్యమద్ది! యీ
వరుసనె పండితబ్రువునివర్తన ధాత్రిఁ జెలంగుచుండదే.

5. సరసకవిత్వమద్ది సహజంబుగ రావలె! పుస్తకంబులన్
మఱిమఱి వల్లెవేసి గ్రహణప్రతిభాదులు లేశమేనియున్
వఱలక యున్న నెట్లొ బుధనామముఁ బొందితి నింక సత్కవీ
శ్వరబిరుదంబు వచ్చుటధ్రువంబని కష్టముమీద నెట్టులో
యరుదుగఁ జెప్పఁ బద్యమది యాపురుమంచును నేడ్చినట్టులన్
బరఁగును జూవె! యట్టికవనం బెట్టులెట్టులొ యల్లియాత్మలో
మురియుటతోడఁ దృప్తిఁగనఁబోవక యాశుకవిత్వశక్తి, సు
స్థిరతరధారణాపటిమ, ధీబలముం, గవకే వధానముల్
నెఱపఁగఁ బూని త్రిమ్మరిన నేటనిపించునె? యెందుఁబోయినం
గరము పరాభవంబగునుగాని; యటంచని యూరకుండునే.

6. గురువును బోలఁగాఁ దగిన కొందఱశిష్యులఁ జంకఁ బెట్టి చె
ప్పరఁ జనుచుండు, నింట మునుఁ జేసినయట్టివియో కవీశ్వరుల్
పరులు రచించినట్టివియొ పద్యములం గొని వారిచే సభాం
తరముల నడ్గఁ బెట్టి యవి దబ్బబ బడ్బడఁ జెప్పివేయు విం
కొరులిడు ప్రశ్నలక్కనయి యొప్పినవానికిసైత మెంతయుం
జిరచిరలాడి చచ్చిచెడి చెప్పును జప్పనిపద్య మొట్టులో.

7. హరిహరి! యెద్దియేని సులభాంశమెయైన జడాత్మబుద్ధికిం
బిరుసుగఁ దోఁపఁ దప్పుకొనువీల కటా! యెదియంచుముందుగాఁ
గఱకఱమంచుఁ బ్రశ్న యిదిగాదిదిగాదని భోకరించు; నే
నరయఁగ లేదు దానఁగల యర్థమదేమని బొబ్బరించుఁ ధీ
వరుఁడెవఁడిద్దియిచ్చెనని పాండితిచాలకధిక్కరించు; ను
స్సురుమని నన్ గలంతురనుచున్ మొగమంతయు నెఱ్ఱఁ జేయు; దు
ర్భరపుశతావధానమిది సప్పును నన్ను ముఁదింటగాదు దు
ష్కరవిషయంబు లీఁదగదుగాయనఁ దెల్ల మొగంబువెట్టు; నీ
కరణి నెట్లొ తప్పుకొనఁగా వశమయ్యెది గాకయున్న "మా
పరువును నిల్పుడయ్య! మము బాములఁ బెట్టకుఁడయ్య! గర్భిణీ
తరుణియగున్ సుమా యిదియథార్థము! మేమిటవచ్చినట్లు మా
పురులకుఁ బంపుడయ్య! యికఁ బోదుము పున్నెమదెల్ల మీకుఁ జే
కుఱు"నని కాళ్ళబేరమునకుం జనుదెంచుచు దేవురించెడిన్.

8. సరిసరి! కుంభకోణమది సాగుటయెట్లు వధాన మొక్క వా
సరమునఁ జేయ ధారణవశంపడకే నగుబాట్లు మాకు దా
పరమగునో యటంచు మిషఁ బన్ని సభన్నిలుపంగఁ జేసి రా
తిరి నుదయంబుఁ బద్దెములఁ దీరిచ వల్లనవేసివచ్చిరిన్

మఱుదినమా సభాంతరమునం జదువంగనుబూని తొట్రుపా
టొఱయుఁగఁ, బాదముల్ పదములూడఁగఁ జాలునుదప్పఁ బ్ర
వరలినవారు పద్దెముల వ్రాసినవా రటుగాదిటంచు న [క్కలఁ
త్వరముగ నత్తివట్టి పయిపైనదువం జెయివెట్టి నెట్టినఁ
జరుగదదెట్టిధారణయొ! శక్తియొ! యొద్దది మొద్దుదానినిం
బరుగిడునట్లుచేయ వశమా! ములుకఱ్ఱయు మొక్కపోవుఁటే
జరుగునుగాదె? మొద్దునకు సాయముఁజేయ గ్రహింపనేర్చునే.

9. సరకుగొనండుపాపము! స్వశక్తివిధం బిదమిద్ధముంచుఁ దా
నెఱుఁగకపోదు; పండ్లబిగువేర్పడఁగా నవమానదుర్యశః
పరిహారవాక్యపుంజములఁ బల్కఁదొడంగును, "మేము వెన్కబల్
మెఱుఁగుగఁజేసినారముసుమీ! మతివ్రాయెను నేడు, నాటిది
త్తఱిఁదలపోసి మమ్ములగృతార్థులఁజేయుఁడి సభ్యులంచు దా
మొఱలిడుఁ; జేతఁగానిపనిఁబూనుదు మీరలటంచు నెవ్వరే
డ్చిరి; యొకవేళ నేడ్చి తమచేసువకీడ్చిన నీడ్చినట్టి యా
పురుషులపజ్జఁజేయవలెఁబో! సభకుం దగువాడనంచుఁ ద్రి
మ్మరిన శుభంబె? వెన్క నసమానముగానొనరించెనంట! యే
వరువను జేసిరో కనినవారిపుడైననులేరె? నాడు కొం
దఱు నుతియించిరేమొ! యదినాకౌనె? హంసలురానివేళలఁ
గరటములే మహాకవులుగాఁ దలపంబడుటద్ది యబ్రమే.

10. పరునిసహాయమందక సభాస్థలినిల్వఁడు పండితబ్రువుం
డరిదిగఁదోప మిత్రుని సభాధిపుగానొనరించి వానినే
పొరిపొరిమూటగట్టుకొని పోవుచునుండును, దారిబత్తె మ
క్కఱఁగొనిపోవురీతి నటుఁగాకయొయుండిన మాడిచావరే.

11 స్థిరుఁడయి కూరుచుండి సభఁ జేసి వధానముఁ బూర్తిఁ జేసినఁ
గరము సెబాసు! వహ్వా! యనఁగాఁ దగుఁగాని; పరప్రదత్తవా
క్పరణములం గొనంగఁ దమకంబున మాటికి మాటికిఁ సభాం
తరమున నుండి చాటునకుఁ దారుచునుండ నిదేటికంచు నే
పెఱిలనఁబోరు; త్రాగుటకుఁ బీల్చుటకంచని యెల్లవారెఱుం
గరే! యిటు సభ్యసంతతుల కన్నులఁ గప్పుచు నొక్క నాటితోం
దర పిరుమూఁడు నాల్గయిదు నాళ్ళకుఁ బెంచి వధానమం చెదో
జరపి మృషావధాని తెగఁ జంకలు గొట్టుచు విఱ్ఱవీగెడిఁ.

12. వరమతిర్యైనయొక్క కవివర్యుని మెచ్చి రసజ్ఞహార! యె
వ్వరు సము లుర్వి నీకనుచుఁ బద్యముఁ జెప్ప, స్వకీయ నిచతా
గురుత నెఱింగి రేమొయని గుమ్మడికాయల దొంగ పోల్కి బా
పురే! యులుకుంగడుంగను; ప్రమూర్ఖుని డంబము లిట్టివే గదా.

13 పెరుగను మాయ వేసమిక వెల్లడియౌనని భీతిగ్రమ్మఁగా
దరి యెదిగాన లేక మతిదప్పి చికాకయి ప్రేలినంతలో
గరువము డంపఁగల్గు కవిగండడు వచ్చి యొగ్గి వేయఁగా
నురమున నాటినట్టి శరమూడ్చఁగ లేక యొ కుందు చెట్టులే
నరి నెదిరింపఁగావలయు నంచును .జెగ్గకుఁ బెన్నలాడు; "నా
శరమది యొక్కటే విడువఁ జాలదు, రెంటిని గల్పి యువ్విధం
బెఱుకఁగలేని నా బలము బీరము చూడిడి" యంచుఁ బల్కుడిం
దఱుచుగ నొంటిఁకిం బుధులు దాకిన యుప్పుడు రెంటికిం జనుఁ.

14. మఱపుకు రాదు దెబ్బ, పొడిమాటలు డాబినఁ బోదు నొప్పి;న
న్నరసి యెవందుగాచుసిక? హా! శివ, రాముడ, స్వామి! యంచును

పిరి నిలుపంగఁ దొక నెటుఁ బీకుటఁ గాయతిగాన కావ్యచుం
ద్వరితగతి ప్రవాహమునఁ బొర్లాడి మున్గుచున్న వాఁడు దా
గరికనుఁజూచి దానిఁ గొని గండముఁ దప్పఁ గొనంగ యత్నముఁ
బరపెడిలాగు, సింగమది పైఁబడ నక్కలవేట కాడు త
న్గురువుగ నెంచి వెంటఁజను కుక్కలఁ దా నుసిగొల్పులాగు, ది
క్కెఱపడరాని పాట్లుపడినంతనె లాభమె? పండితబ్రువా!

15. అఱవమునింగిలీషు మఱియాంధ్రము తుర్కము మాటలాడె
దొరలకు వంటవాఁడు నిపుణుండగు బట్లరు పాకశాస్త్రి నా [ను
బిరుదముఁ బూనినాఁడు, పురవీధులఁ గ్రుమ్మరి నాల్గు బాసలన్
“గరిమను జూపువాఁడ, బుధకాండులు రంగడనం దోచునట్లుగాఁ
బరిచితిఁ బూర్తిచెందక బాసను నైనను, గోవులేని యా
పురమున గొడ్డెలచ్చియను పోడిమిఁ జెందుచు నొక్కబాసలో
దగఁగనినట్టి పండితునిఁ దార్కొసినావలె రెండు బాసలీ
వెలుఁగవు నాకు రావసిన నెంతయు లాభమె పండితబ్రువా!

16. తిరుపతి పైది కొప్పరము, దీనికిఁ గ్రిందుగనుండు వెంకటే
శ్వరుఁ డుపరిస్థలాంశమిది సత్యము సత్యము సత్యమంచుఁ జూ
పఱులకుఁ దోఁపుచుండఁ దలపైఁగల వస్తువుఁ జూడలేమి నా
తిరుపతి, మూలకొకప్రదేశమునందున డాగి వెంకటే
శ్వరుఁ డొకరిద్దరద్దికనఁ జాలక యున్నను వీనిసంగతిన్
గరము యథార్థమే తెలుపఁ గల్గియటంగల పాటిబాడలే
వఱిపరికర్మసాక్షులయి పల్కఁగ నీగతి దాటు కెట్టులో
యొఱుగనటంచు వాదెఱచి యేడ్చిన లాభమె? పండితబ్రువా!

17. ఒరులగుణాతిరేకముఁ గళోన్నతి సుప్రతిభావిశేషముల్
సురుచిరవాగ్విలాసమునుజూచి సహింపఁగలేక వారిని
ల్లరువినుతింపఁగాఁదనకులాఘవమయ్యెడినంచు నీసుతోఁ
గొఱకొఱమంచు, వాదమునకుంజనుదెమ్మనరాక యేదియో
వెరవునుజూచుచున్ వికటవేషములెన్నియొతాల్చి చాటునం
బరబరికూసికొంచు నవమానభయంబును బొందఁబోక, కొ
క్కొరపనులాచరించి యపకీర్తికిజంకక. సిగ్గులేక సుం
దరమని పెద్దచిన్నయును దైవము నీతియువీడి దేనికిన్
వెఱవనటం చిసీ! విడిచివేసినవానివిధంబుదోఁప నా
సురపదయోగ్యలక్షణముజూపుట లాభమె? పండితబ్రువా.

18. తరమగునే సలక్షణవధానము నల్పమృషావధానికిన్?
«బరమముదంబుమాకునొకవందయిడంబని వేఁలటంటమే
మెఱుగమె? «యిప్పుడంతకును నిబ్బడిముబ్బడి నాల్గురేళ్లుగా
దిరువదిరెట్లకిబ్బడిగనిత్తుమువచ్చి శతావధానముల్
నెఱపుఁడటన్న మొద్దుబలె నిశ్చలవృత్తినిబూనియుంటి వె
వ్వరికమృషావధానియొ ప్రపంచమెఱుంగదె? పండితబ్రువా.

19. అరసితిసిగతింబిసుగువాదుసుమీ సొరకోతలందు; బా
గుర! యిదిదూరమేగి గోడఁగొట్టెదు, పండితిగల్గినన్ సభాం
తరమునఁబండితేంద్రులువినన్ భవదీయకళాతిశక్తి, వ్యా
కరణవుఁదెల్విఁజూపుమనఁగాఁ జెవిదూరదదేమొ! వల్లభుల్
విరిసినయట్టి కాంతలబలెందలనూపదు ధైర్యమూని, యె
వ్వరికయుపండితుండొకొ ప్రపంచమెఱుంగదె? పండితబ్రువా.

20 భరమనియెంచఁబోక పయిబట్టయు వచ్చెడిలాగు వెంబడిం
బడువిడుచున్ వధానమునఁ బాతికవంతున రెండునాళ్ళకుం
బెరుగఁగఁజేసి గోడపయిపిల్లి విధంబుననుండి సాయముం
దఱిగని పెట్టిచేయుచుఁ బదంపడి పృచ్ఛకులిచ్చు ప్రశ్నలం
దఱిముఱిసాధ్వసాధువిషయంబులు చర్చకువచ్చినప్పుడం
దఱికి స్వపాండితీస్థితి కనంబడకుండ, వధానికప్పుడే
పరిభవమబ్బకుండ, బలె! పామదిచావకయుండఁ గల్గియున్
విఱుగకయుండఁజెప్పు మదినేరుపుఁజూపెడి మధ్యవర్తియై
తిరిగినవానిదౌ ఋణముఁ దీర్చుకొనంగ నతిత్వరన్ మహా
దరమునుజూపుచున్ శతవధానము వారముమీఁద నొక్కటన్
దలిచి వాగ్గురెల్లుగఁ గృతజ్ఞతఁజూపి శతావధానులం
చోరులను దువ్విపంపిన మహోన్నతిఁగాంతువె? పండితబ్రువా!

21 చెఱుపదియేనుగున్ నిజముఁజెప్పిననిష్ఠుర మొక్కటేసుమీ!
స్థిరతరకీర్తిపూరుషులు తిక్కన పెద్దనమూర్తిలాగునన్
సురుచిరసత్ప్రబంధములు సొంపులుగుల్కఁగఁ జేసియుంటివో,
యరయఁగ దేవభాష నొక్కటైననుఁ గావ్యము వ్రాసియుంటివో,
హరిహరదైవభక్తివిషయంబగు. పద్దెము నోటవచ్చెనో,
మఱియుట కేమి? జల్లుపదముల్గల పూర్తికిరాని పొత్తమున్
సరసములంచు మెచ్చుచును జాకలి మంగలి వేశ్యజాతులుం
బరమపురాణముల్ బలెను బాడుచునుండెడి కొన్నిపొత్తముల్
మఱియుమహాప్రబంధమునె మార్చివికారముఁ జేయుపొత్తముల్
కరకరగీసి బాపురె! చకాపికి చక్పికి గ్రంథకర్తనం

చురవడిఁ బాటపాడిన నహహో! యభిమానులు వంతపాడినం
గురుతరకీర్తిఁ గాంచుకొంటి వెఁ? కృతి వెఁ? పండితబ్రువా!

22 గిరపతిగింకటంబులను గీటడగింపఁగ గిత్తి గిన్కతో
గిరపతిగింకశేశ్వరుల గిండకు గీటుగగిరి గిక్కడం
గిరగిరగింతగీధలను గీరతముం గిలె గీడిగీడియా
గిరియును గియ్యముం గెదరి గీవ్యమటంచున్నగీసి యద్దియే
వరకృతియంచుఁబొంగుచును "వంచన మొక్కటి కాకి! కాకి! నీ
స్వరము మనోహరంబునుమి! పాడుమటన్నను నుబ్బి నోటిలో
నెరపడిపోవుటంగనక యెంతయుగూసెడిలాగు" మీకృతుల్
సరసముతోర! యేది యొకసారిపఠింపుము పద్యమొండనం
బురబురఁబొంగి యర్భకులముం దభిమానులముందు దేహముల్
మఱచి సుధీసభాంతరముల్ మఱివీధులలోన మాటికా
వరకృతిలోనిపద్దెములె పాడుచు బల్ తయితక్కతందనాల్
బఱపినయంతమాత్రమునఁ బండితుఁడౌనొకొ పండితబ్రువా!

23 కరటబుధప్రతీప మదగర్వహరుండగు నొక్కరాముఁడే
పరుఁడనియెంచనేల? తలపన్ విబుధేంద్రుఁడు శ్రీనివాసుఁడుం
సురనుతిపాత్రవాగ్రమణ సూర్యపదాన్వయ సత్యవాదులుం
గరమశుభం బనర్థకము కయ్యమువానుమటంచు నీతినిం
గఱపఁగఁబూనువార లతికంటకులంచుఁదలంచి రావణా
సురుఁడెవి మాటగట్టుకొనె? చూడఁగఁజాలవు మర్జనల్ రమిం
తురు కలహోద్యమంబు సుజనుల్ నిరతంబును సంధిమార్గమే
యరసెద"రన్న న్యాయమహహా! తెలసెం భవదీయపాండితీ
భరమిదియంచు; నీకెతగుఁ బండితనామము పండితబ్రువా!!

24 అరయఁగ గ్రంథకర్త యొకఁడంట! వధానియు నొక్కఁడంటపో!
మఱియొకఁడంట యాశుకవి! మాటలుతీపివ భేదబుద్ధియే!
మురియకుఁడీ! యుపాయముగఁ బోరడఁగింపఁగఁ బాళ్ళు సేసి ము
గ్గురికిని బంచిపెట్టె నిదిగో కనుమా యయగారుమాన్యులే॥

25 పరమహితుండు కృష్ణుఁడని వంగి పురంబును జొచ్చి వేడఁగా
శరణమతండు దాని మనసాకనకుండునె! తన్నుఁ బెద్దగా
బురమున నేఁగఁ జేసి గురుపూజలొనంగిననాటి భక్తి ని
మఱచునె? పక్షపాతియనుమాటల వేటికిఁ బండితబ్రువా॥

26 మురిపెముతోడ నర్భకుల ముందిడికొంచు మహాట్టహాసముల్
బఱపిన పెద్దవారివని బాగట! బాగట! యెట్టిపెద్దవా
రెఱుగకయుండఁ బిన్నలదియేమొ యొనర్చిరటంచు నొచ్చి సుం
దరతర వాక్యముల్ పలుక న్యాయముఁ జెప్పినవాడవౌదువే॥

27 ఉరకయె పెండ్లిపల్లకి మఱొక్కని బాలకు నెక్కఁ జేయు, నా
వరుసను నెక్కునెల్లరు గుబాలునఁ బెండ్లికుమార్తె కెక్క మనో
హరులయి పుట్టియుంతురని యార్చెడి పెండ్లికుమారుఁడెంత స్వ
వరుఁడో! ప్రపంచతత్త్వపరిభాసితచిత్తుఁడో! యద్దిగాక యొ
క్కరుఁడు మఱొక్కఁడింక మఱొకండును బల్వురు నెక్కుచుండఁగా
బరువయి పల్లకి విఱ్ఱిగి పాడగునంచును మోయువారలే
మొఱలిడరో! వధూవరుల మోములకడ్డని పెండ్లిపెద్దలే
యరువరో! సిగ్గుతా విడిచియార్చెడి పెండ్లికుమారుఁడుండునే॥

28. పఱచియపండితుండొకదపండితగోష్ఠికి రాకడాగెదుర్
గొఱతఘటిల్లుకీర్తికని గుట్టుబయల్పడకుండఁ జేయు చా

తురి మెయిఁదత్సభాస్థలిబుధుల్ గలరేమొ యటంచనాకపా
మరతనుదప్పుగానిదియె మాటికిఁదప్పని నొక్కిపల్కెడున్
సరసుఁడెట్లైనఁ బండితులసన్నిధిఁ బిమ్మటనైన నేర్పి కా
వరమున నొప్పు తప్పనుచుఁ బల్కితిఁ దప్పని నేను జెప్పకే
మఱిమఱిగొప్పతప్పని" క్షమాపణఁ గోరుటమేలు, దానిచేఁ
బరువునుబోదు; కాదనినఁ బండితగోష్ఠినినిల్పుకోదగున్.

29. సరసముగా సభాస్థలినిజాటుము నీదగు ప్రజ్ఞలన్నిటిన్
విరసము లేటికిన్? గపటవేషముఁదాల్చఁగఁ జక్రవర్తివే!
యరినెదిరింప వాదవిషయంబె? పోనిడి ప్రక్కత్రోవలన్
సరభసవృత్తిగంతులిడసాగెదు దొంగనుబట్ట లేరొకో?

30. నిరతము పచ్చిదొంగయయి నీచపుఁద్రోవలఁబోవువాడవె
ల్తురుఁగని సైపలేకెచటఁ దోరపుఁజీకటియుండునో యటం
చరయుచునుండు, రంధ్రములనన్నిటఁజూడఁగఁగోరు, నోటినిన్
దెఱచినబూతులే దుముకు, తెల్పుసువాక్కులబూతులంచాగిన్.

31. " సురసనగేంద్రమాయ్యాది విశుద్ధసుధారసపూర్ణముల్
సరసులగాధముల్ గలవుచాల; తలంబటఁగాన లేక బా [దొనల్
వురె! సుమనః ప్రకాండములు మున్గుచుఁ దేలుచునుండు, నింకఁ గిం
పురుషులఁబట్టనేర్చుపదముల్ గలవౌర! మహోచితస్థితిన్.

32. ఉరుమహిమాస్పదంబులుమహోన్నతముల్ కృతిరాజము
భరణములన్ రచించియలపద్మజ దేవి నలంకరించినా [ల్పతా
డఱిదిగఁ; బొత్తమొందు సగమైనరచింపఁగ లేక మాన, డం
తరమెఱుఁగంగ లేవు బుధనాథుడవౌ! కవినేతవౌ! బలా!

33. మొరటునకబ్బఁగా మొగలిపూవు తదీయసుగంధధోరణుల్
పరసమతిం గ్రహించునె? ఘాసన్ వెలిఁబుచ్చు వ్యాకీయతుచ్ఛతన్
విరివిగఁజాటుచాట్లునను బ్రేలెదు బూతులో పచ్చిబూతులో ;
తెరవిడిరమ్మురమ్మిపుడ తెల్పెద బూతులుగావు నీతులే! [ముల్!

34. ఎఱుఁగుదుమీదు ప్రాణములకెంతయు భారముమీదు ప్రాణ
నెఱతుమె మేము? మానిమునె పెద్దగఁజూతురుగాదె పండితుల్!
ఇరవిదిమాకుమీకదిసుమీయను భేదము లేదు; పండితుం
డరమరలేకసర్వవిషయంబుల నెప్పుడుఁ బూజ్యుఁడేయగున్.

35 మఱుగుకుఁబోక తప్పకొనుమాటలనాడక, స్వోక్తిపోషణా
దరమదియున్నఁ, బాండితిపదంపడియున్న, సభాప్రసంగమో
పరగునఁబ్రశ్నకాముఖపుఁజర్చయొ, మీకెటబాగొయందెయే
ర్పఱచిభవత్తదుక్తినిలుపందగు"నంచన మానమూనెదున్.

36. నిరతముజీవనంబుపరనింద సుమీ! యదియేమొ! తానున
త్పురుషుఁడైనచో నొకరితోమఱియొద్దరితోడఁగాదు తా
నరిగినచోటనెల్లఁ గలహంబులె సజ్జనపాళితోడ; నో
రరయఁగమంచిదైనజగమంతయు నప్పుడెమంచిదైచనున్.

37. పరులనుగారు వారు మనవారలెపాపమటన్ వధానముల్
జరుపఁగఁజేసిమీకు నరసంబుగ నూటపదారులిచ్చి స
త్వరముగ గారవించి మదిఁదాపముఁబాపధనంబు పోగుచే
సిరి పిలువంగసాగిరది నేగియె పోరది యేమిహేతువో.

38. విరతినొందఁగి కుక్షిభృతి వేషపరంపర కింటిమూలఁజే
రిరొయ్యనేల? గుండెచెదరెన్ సుమీ! నట్టిననేని, వెన్నునుం
జఱచిననేనిఁబూర్వగతి సాగదు: శక్తియొకింత తగ్గినన్
గొఱతయె? యింకఁదోలుదురు కుండలలోపల గుజ్జుమేఁ వడిన్.

39. ఎఱుగవు నీదునోటిమనుకీగతి దెచ్చెను మాయసింగమా!
శరభనివాసమిద్దియగు; సత్యమృగేంద్రము లేవడం కేడిన్
శరణము వేడి కాచుకొనఁజాలును బ్రాణములంచుఁ దెల్పఁగాఁ
బరువెటులేని నిల్పుకొన బాగని కాలికిబుద్ధిసెప్పెదన్.

40. మరణము మేలుగాదె యవమానముకన్నను; నాల్గు డబ్బు
దొరుకనినుం భరింతుననితోఁపఁగ నీపనిఁబూనినాఁడ నీ [లుం
భరణముకోసమై పడిపాటులు నాకవి ప్రాణగొడ్డపుం
జెఱలయి యేచుచున్నవి యిఁసీ! యని పొట్టకుబుద్ధిసెప్పెదన్.

41. పరునిబలంబు నాబలము బాగుగఁజూడక కాలుద్రువ్వఁగా
బరపెదు; పిచ్చిసాహసము ప్రాణములార్చు; నతండు సత్కవీ
శ్వరుఁడు, మహానుభావుఁడు, యశస్వి, సుధీమణి; నక్కయేడ? యా
పరమపదంబదేడ? యని పల్కుచు గుండెకు బుద్ధిసెప్పెదన్.

42. చరమదశన్ విషాదగతిసంభవమయ్యె; వధానకార్యమున్
నెఱపుటతప్పు; చూపవలెనీదగు ధారణయంచు సభ్యులం
దఱుబలవంతిపెట్టిరెటుఁ దప్పుకొనంగలవాడ నింక పై
జరుపఁగఁబోకుమంచుఁ బదిసారులు నోటికిబుద్ధిసెప్పెదన్.

43. చెఱుకుగు తెల్వితేటలవిసున్న యోగ్యైన పదాత్మతంగకుం
బరువుగఁబల్కి పెద్దలిడుమ్మన్న వలగనబోక మంచి సె
బ్బరఁగన లేని యర్థ్యకులపాలయితింగద! చెడ్డబుద్ధినిఁ
నరనకునిడ్డ్వికూలెప్పనని ఛాటునబుద్ధికి బుద్ధిసెప్పెదుర్.

44. ఉరమున్నపాండితీమహిమఁ గన్పడఁజేసి పొగడ్తఁ జెందఁగా
సరియనిపించుఁగాని తన్త్రసాహితిగట్టిగఁ జూడనట్టిదో
యొఱుఁగకపండితప్రవరు లెంతటివారయియున్న నాసుధీ
వరులకునేమిరాదనుచు వాగుచు నింకఁదనంతపండితుల్
మఱియొక యెవ్వరుండరని మాటికిమాటికిఁ జాటుచుందుటల్
ధరణినిఁబండితబ్రువుల లక్షణమంచు వచింత్రుకోవిదుల్.



